మొదలిడిన ప్రార్థనలతో మతం ప్రారంభమయింది. అనుభవంలో మానవునికన్న జంతువులు తరుచు బలీయమైనవిగాను, సునిశితబుద్ధి, కలవిగాను కనుపించాయి. జంతువులు మానవునికన్న వేగంగా పరుగెత్తుతాయి. మానవ ప్రవేశ దుస్సాధ్యములైన ప్రదేశములలో కూడ సులభంగా ప్రవేశిస్తాయి. తీక్ష్ణతర దృష్టిని, సూక్ష్మ తరమైన వినికిడి శక్తిని కలిగి ఉంటాయి. దూరమునుండి వివిధ వాసనలను, ముఖ్యంగా నరవాసనను పసికట్టి గలిగిన శక్తిగలిగి ఉంటాయి. బలమైన కాళ్ళు, పంజాలు, గోళ్ళు, కొమ్ములు, కోరలు కలిగియుండు వివిధ క్రూర మృగములకు వేరుగా ఆయుధముల అవుసరములేదు. ఒక్కకాటుమాత్రం వేసి పాము మనుజులను చంపగలుగుతోంది. పక్షులాకాశవీధులలో యెగురగలుగుతున్నాయి. కప్పలు, చేపలు మొదలైన జలజంతువులు నీటిలో నివసించ గలుగుతున్నాయి. ఇవన్నీ మానవాతీతమైనపనులే. ఈ శక్తులన్నీ అద్భుత మైనవిగాను, అందుచేత పవిత్రమైనవిగాను వేటగాండ్రైన ఆదిమ మానవులకు తోచాయి. అందుచేతవారు అట్టి జంతుల వంకకు తిరిగి తమకు సహాయపడమనీ, తమను రక్షించమనీ ప్రార్థించ నారంభించారు.

జంతువుల ఆరాధన పద్ధతే మతములకుపునాది. కుటుంబ సమాజంలోనే ప్రప్రథమంగా ప్రారంభ మయింది. కుటుంబసమాజములు తరుచుగా అవి ఆరాధించు వివిధజంతువులయొక్క గాని, ఒకొక్కప్పుడు వివిధ వృక్షములయొక్కగాని పేర్లతో పిలువ బడేవి సమాజమునకు ఏ జంతువు పేరు పెట్టబడునో ఆ జంతువు సమాజమునకు కులదేవతగా, రక్షకురాలుగా తలచ బడేది. యాత్రికులు ప్రప్రథమంగా ఆస్ట్రేలియా చేరిననాటికి, ఆస్ట్రేలియనుల మధ్య యిట్టి జంతుపూజ అతి ప్రబలంగా వ్యాపించి యుంది. మృగదేవతలు మానవుల ప్రార్థనల నాలకించి, వారికోరికలను మన్నించి, సఫలీకృతం చేస్తాయని హృదయపూర్వకంగా నమ్మేవారు. ఉదాహరణకు కంగారూ జంతు సమాజ సభ్యులు తాము వేటకు వెడలినప్పుడు తమకులదేవతయైన కంగారూ తమ్మనుసరించి అపాయము సంభవించుటకు ముందు కేకేసి, తమ్ము హెచ్చరించి రక్షిస్తుందని నమ్మేవారు. ఈ విధమైన అనేక నమ్మకాలు వివిధ సమాజాలలో వారివారి దేవతలపట్ల ప్రబలంగా వ్యాప్తిలో ఉండేవి.

పైగా కొన్ని సమాజాలవారు తమ మృగదేవతలే, మృగదేవత లను పోలినవారే తమ పూర్వీకులనీ, వారి నుండే తాముద్భవించామనీ, నమ్ముతారు. ఉదాహరణకు కొన్ని ఆస్ట్రేలియన్ తెగలవారు తామూ, తమ మృగదేవతా కూడ అర్థమానవులనుండి, అర్థమృగములనుండి ఉద్భ వించారని నమ్ముతారు. అట్టినమ్మకములు పూర్వమన్ని దేశములలోను వ్యాప్తిలో ఉండేవి. సోవియట్ యూనియన్‌లో యిప్పటికీ కొన్ని జాతు లలో అట్టి నమ్మకాలున్నాయి.



